# కీ॥ శే॥ డాక్టరు రాఘవేంద్రరావు

## డిఫెన్సు విషయమై వారి పట్టుదల-సర్ క్రిప్సుగారి కలవరము

## డాక్టరు పట్టాభిగారి ప్రశంస

బందరు, జూన్ ౧౩ -

డా॥పట్టాభిసీతారామయ్యగారీక్రింద ప్రకటన గావించినారు

కీ॥శే॥ డా॥ రాఘవేంద్రరావుగారి దేశభక్తి, ప్రజాహితబుద్ధి భారతదేశచరిత్రయందాతనికి సుస్థిరముగుస్థానము చేకూర్చును

వీరుకృష్ణాజిల్లావాస్తవ్యులు-పెద్దమద్దాలి కాపురస్థులు-వీరింటిపేరు ఈడుపుగంటివారు-శ్రీ అడుసుమిల్లివారివీడుగారు వీరిబావమరది-ఈయన జీవితమంతా మధ్యరాష్ట్రములలో గడపినారు-అక్కడనే పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు

### కాంగ్రెసుతో సంబంధం

మొట్టమొదటినుండి గాంధిపక్షము వహించి కాంగ్రెసులోచేరి దేశవిముక్తికై పనిచేయుచుండిరి ౧౯౧౯వ సం॥ జూలైమాసములో కలకత్తా నగరమునజరిగిన అ భా, కాం సం సభయందు అమృతసరబాధితుల సహాయార్థము రు,౧-౨౦౦ చందాఇచ్చి అనేకులకుమార్గదర్శకులయిరి-రానురాను కాంగ్రెసుపంథనుండి వీరు విడిపోయినను వీరిదేశాభిమానమును జాతియొక్క-ఆత్మగౌరవమును తమప్రవర్తనయందు ఆదర్శములుగనుంచుకొనిరి-సెక్రటరీఆఫ్ స్టేటుకౌన్సిలు మెంబరయినప్రుడు మద్రాసులో వీరికిచూపబడినగౌరవమే వీరు జనసమ్మతులనుటకునిదర్శనము

### ఆంధ్రరాష్ట్ర సంపాదనకై కృషి

అందరువెళ్ళకపూర్వము ఆంధ్రరాష్ట్రమును సంపాదింపగలము అను అత్మవిశ్వాసము గలిగియుండిరి-ఈవిషయమై పట్టిసముతో వీరులందరుకల్గిరికాని, ఆకాంగ్రెసునందలనేకచెప్పను-ఆంధ్రరాష్ట్రపరాజయమునుగూర్చి ఎప్పటికైనా అంచనులోని వెట్ హాల రహస్యము బయటకు రావలసియున్నదో, ఏదేదానిని తెలుపగలవారు. వీరితోఆరహస్యము భూస్థాపితమయినదని చెప్పవచ్చును-కానివీరొకనాడు ఈరహస్యము ఏదోవిస్వప్నముగానో ఆయనబయటపెట్టకమానరుమెంబర్లిల్లో క్రిప్సుగారి రాకసందర్భమున వీరు పాతస్నేహితుల నందరను మాడవలెనని కుతూహలురైరి- నేనుమూడుసార్లు వెళ్ళిచూచినాను-పటేలుగారుకూడా చూచిరి రాఘవేంద్రరావుగారిశ్రమచే మహాత్ముని సందర్శించిరి

### డిఫెన్సు అధికారులకు పట్టుదల

కీ॥శే॥ డాక్టరు రాఘవేంద్రరావుగారు తమ జీవితములో నతేకసత్కార్యములు సాధించెను-ఆయనసాధించినఆఖరు మహత్కార్యమువిషయమై ప్రజలకంతగా తెలియదు- డా॥రాఘవేంద్రరావుగారితో మెలంగుట సర్ స్టాఫర్డుక్రిప్సుగారికి బాలకష్టముగానుండెను

డా॥రాఘవేంద్రరావుగారు, విదేశమాసమగు దేశభక్తిప్రకటించుటచేతను, యుద్ధమునకు ప్రత్యక్షముగాసంబంధించియున్నట్టియు, సైనికసమీకరణకుసంబంధించినభాగముతప్ప తక్కిన దేశరక్షణబాధ్యతనంతటిని సంపూర్ణముగా భారతీయులకు సంక్రమింపజేయవలెనని చెప్పుటచేతను సర్ స్టాఫర్డుక్రిప్సుగారికి కోపముగూడవచ్చినట్లు కనబడుచున్నది-డా రాఘవేంద్రరావుగారి పై అధికారి సర్ స్టాఫర్డు గారును ఇండియాప్రభుత్వదేశరక్షణశాఖసభ్యుడును నిశ్చేష్టితులై మూడునిమిషములు కాకతిముఖములు చూచుకొనుచు కూర్చుండిరి-అటుతరువాత ఎవరును మరియొకరితో మాట్లాడవలెననియు, డా॥రాఘవేంద్రరావుగారు వెళ్ళిపోవచ్చుననియు సర్ స్టాఫర్డుగారుచెప్పిరి-వెంటనే డా॥రాఘవేంద్రరావుగారులేచి, తనంతటదామక్రిప్సుగారితో మాట్లాడుటకురాలేదనిచెప్పెను-సర్ స్టాఫర్డుగారుమాట్లాడకూరకుండిరి-ఇంతటితో ఈవిషయమంతమయ్యెను

### ఇండియాప్రభుత్వ సభ్యత్వం

రాఘవేంద్రరావుగారుఅందముకు ౧౯౩౯లో వెళ్లినప్పుడే కాముప్రత్యేకంగాడిఫెన్సువిషయమై అక్కడిగ్రంథములు రికార్డులుపఠించెదమని చెప్పియుండిరి-అక్కడినుంచితిరిగి డిల్లీకిడిఫెన్సు మెంబరుగావత్తురనేనమ్మకము నాకంటె అయనమనస్సులోకూడా ఉండియుండును- రావడమైతే ౧౯౪౧లోడిఫెన్సు మెంబరుగావచ్చిరికాని, అది డిఫెన్సు సైనికశాఖలకుచెందినదికాక, సివిల్ శాఖకుచెందినదైయుండుటచే వీరియర్హతకు తగినపదవి వీరికిలభింపలేదని చెప్పవలసియున్నది-

### అస్వస్థత

ఏప్రిల్ ౩౦తేది జరిగిన డిఫెన్సుకౌన్సిలు మీటింగులో వీరు తమఉపన్యాసమునుచదువుటలో పడిపోయినందున ఆయాసముగ ఉన్నది గనుక వెంటనే సభనుండి వీరిని సైప్రసాయిగారుఇంటికిపంపి ఆనాటినుండి కచేరికిరాకుండా ఇంటివద్ద సేవనిచూడవలెనని చెప్పిరి-ఆలాగే బొందిలోప్రాణమున్నంతవరకు తమవిధినిమధ్యలో ఎతముగాదిరకేయిస్తూ నడిపియున్నలో అనగా ౫-౩వతేదీ అవతారమును ముగించిరి-

అందములోయుద్ధపరిస్థితులవలన ఆహారము దొరకక ఆరోగ్యముపోగొట్టుకొనిరి- వారముక కాలమొగిసుద్దు రోజులుపోట్టికాని చిల్లంత మెన్నకంటే ఎక్కడదొరకనందున వీరిఆరోగ్యము చెడి-వ్యాధిగ్రస్తులై ఈదేశముకు వచ్చి ఆవ్యాధి రానురానుబలమై చివరకు వీరికి అకాలమరణము సంభవించెను-పురుషునిరొక్క లక్షణము పౌరుషము-రాఘవేంద్రరావుగారు పౌరుషముతో జీవితమునుగడిపిరని వారి జీవితచరిత్ర ఘోషించుచున్నది

—ఆంధ్రపత్రిక-



## నల్లగొండ

ఒకప్పుడునీలగిరిపత్రిక, ఆంధ్రసరస్వతీనిలయము, కళాభివర్ధనీపాఠశాల, విద్యార్థిసంఘము, మున్నగువాటిద్వారా తనదివ్యవిజ్ఞానజ్యోతుల ప్రసరింపజేసిననీలగిరి, స్థానికులనియత్నావా, నిరాదరణలకుగురిఅయి కొంతకాలముసంచలనముతేక అజ్ఞాతవాసముగడిపినది- తిరిగిరెండుసంవత్సరములనుంచి స్థానికయువకులలో కొత్తఉత్సాహము కలిగినది- తత్ఫలితముగాశిథిలమైన భారతీనిలయమును గ్రంథాలయమూపునరుద్ధరింపబడిజయప్రదముగానడుపబడుతూవున్నది- వైదికబాలికాపాఠశాల వసతిగృహముస్థాపింపబడి అవిచ్ఛిన్నముగాకొనసాగింపబడుచున్నవి- రాత్రిపాఠశాలలునెలకొలుపబడి, బీదలకు ముఖ్యముగాహరిజనులకుఉచితముగా విద్యగరపుచున్నవి- వ్యాయామశాలయందభిరుచిగలవారై యువకులుతమఆరోగ్యబలాభివృద్ధులకొంచుకుంటున్నారు- యువకులలోనిజంగాఒకనవీనజీవకళ చిగురించుచున్నదనిచెప్పవచ్చును- ఈప్రయత్నమంతా నిన్నమొన్నబళ్లువిడిచిబయటికివచ్చినయువకుల కృషిఫలితమే- వైదికబాలికాపాఠశాలనునడుపుచున్న శ్రీమాణిభద్రదేవుగారు, శ్రీ భారతీనిలయమును నిర్వహిస్తూవున్న శ్రీయుతులు జి- షాండురంగారావు పి ఆర్ నటరాజగార్లుతదితరయువకులు మిక్కిలిప్రశంసనీయులు

ఇవియన్నియును ఆరిష్టములకతీతమై కొనసాగుటకు శ్రీదోమలపెల్లిసోదరుల ఔదార్యమే ముఖ్యకారణమనిచెప్పవచ్చును- శ్రీయుతులు దోమలపెల్లియాదగిరిరావు, నరహరిరావుగార్లు దాదాపుఇరువైవేలకరీదుగలతమగొప్పభవనమును,బాలికాపాఠశాలకై శాశ్వతముగాదత్తముచేసి మనరాష్ట్రమునందు శ్రీమంతులకందరికిని ఆదర్శప్రాయులైరి- శ్రీయుత దోమలపెల్లి వెంకటరాంరావుగారు, తమప్రాసాదమునొకనూతనుంది నిరాటంకముగాకొంత్వవని చదువుకొనుటకనువు, రాజవీధి కెదురుగావుండువిశాలమైనహాలును అద్దెలేకుండఉచితముగా శ్రీభారతీనిలయ గ్రంథాలయమునకుదయచేసి మనకందరికిని కంజ్ఞతనీయులైరి- శ్రీయుతదోమలపెల్లి వెంకటేశ్వరరావుగూడ కొన్నిబీరువాలు, వాటినిండా పుస్తకాలుగ్రంథాలయమునకుదానముచేసి చాలా సహాయపడిరి- ఉదారులగుదాతలు, ఉత్సాహవంతులగుయువకులుగలనీలగిరినిజముగా భాగ్యవతియనిచెప్పవచ్చును-ఇట్టిపనులలో స్థానికప్రముఖులు పెద్దలుకూడాచేయూతనిచ్చి అండగానిలుచున్నచో ఇట్టిధికవిజయవంతముగా యువకులు ముందుకుపోగలరని ఆశిస్తున్నాను

ఇట్లు
మాటుపూరు వెంకటేశ్వరరావు.
బి ఏ ఎల్, ఎల్ బి నల్లగొండ

# గోలకొండపత్రిక

చిత్రభాను సం॥ర నిజ జ్యేష్ఠ శు॥౧౨ గురువారము

## మనరాష్ట్రములోని మద్యపానము

హైదరాబాదురాష్ట్రప్రభుత్వము వారు ౧౩౫౦ ఫసలీ సంవత్సరపు నివేదికను ప్రకటించినారు. ఇది ౧౩౫౧ ఫసలీ అంతము లోవచ్చినది. ఇంతవరకే ౧౩౫౧ ఫ. నివేదిక రావలసియుండెను. ఈవిధముగా ఆలస్యముగాని వేదికలు వెలువడుటవలన లాభముండదు. ఈసంవత్సరాంతములోపలనే ౧౩౫౧ ఫ. నివేదికలు వెలువడునట్లుగా ప్రభుత్వమువారు గట్టిఆజ్ఞలను అన్నిశాఖలకును పంపవలెను.

మనరాష్ట్రములో ఆబ్కారీఆదాయము చాలాముఖ్యమైనది. ఏటేటఇంచుమించు రెండుకోట్లరూపాయలు ఈశాఖ వలన వసూలగుచున్నవి. భూమిపన్ను మొట్టమొదటిఆదాయము దానితర్వాత యీఅబ్కారీయే రెండవఆదాయంపద్దు. మూడవది కరోడిగిరి (సుంకము) ఆదాయము. రాష్ట్రముయొక్క పరిపాలనశక్తి యంతయు ఈమూడింటిపైననే ఆధారపడియున్నది అయితే మద్యపానంవలన వచ్చేఆదాయమును ఎవరునీతితోకూడినట్టిదని ఒప్పుకొనరు. ప్రజలు కల్లు,సారాయిత్రాగుట, నల్లమందుతినుట, భంగు, గంజాయిపొగపీల్చుట, మంచిదని ఎవరూ చెప్పసాహసింపరు. ఆరోగ్యమేమైనా కలుగుతుందాఅంటే అదియులేదు పైగా మద్యపానము ఆరోగ్యనాశనమును కలిగించును. సంఘమునకేమైనా లాభమా అంటే అదియులేదు. నీతిబాహ్యమైనట్టి పనులు, నేరములు, దౌర్జన్యములు, ఈ మత్తుద్రవ్యాలసేవచేత మరింత హెచ్చునని ప్రపంచమందలి అన్నిదేశాలలోను అందరును ఒప్పుకొన్నవిషయమే. మరెందుకీమత్తుపదార్థాలకు లైసెన్సులేర్పాటు చేసిప్రజలచేవీటి నిసేవింపజేయుచున్నారు. దీనికొకేకారణము కానవచ్చుచున్నది. ప్రభుత్వానికి దీనివలనచాలాగొప్ప ఆదాయముకలుగుచున్నది, కావున దీనిని ప్రభుత్వము వదలుకొనజాలదు

అయితే ప్రభుత్వము వారుకూడా మద్యపానము ప్రజలకు నష్టకారియని గ్రహించకపోలేదు. వారావిధముగా గ్రహించినందుననే మితపానసంఘము (టెంపరెన్సు)ను ఏర్పాటుచేసినారు. దానికి ఏటేట పదిపదేనువేల రూపాయాలిచ్చి పోషించుచున్నారు. మితపానసంఘము వారు పాపముచాలాశ్రద్ధతో ఆసక్తితో రాష్ట్రమంతటను ప్రచారముచేయుచున్నారు. ఒకమాసపత్రికను వివిధభాషలలో ఉర్దూ, తెనుగు, మరాటీ, కన్నడ భాషలలో ప్రకటించుచున్నారు. వారను ఒకకచ్చేరీఏర్పాటుచేసుకొని కరపత్రాలు వ్యంగ్యచిత్రాలు, గోడపటాలు అచ్చుకొట్టిప్రజలలో ఉచితముగా పంచిపెట్టమన్నారు. విరివిగాసభలు చేయుచున్నారు. కల్లు, సారామున్నగు మత్తువస్తువులవలన అపారంగానష్టమున్నదని జనులకు మనసుకెక్కునట్లు బోధచేయుచున్నారు కాని ఏమిలాభం! గట్టుకురాళ్ళు మోసినట్లుగా అయిపోయింది పీకిశమణి తా! అబ్కారీనివేదికలు చూచినప్పుడంతయు మితపానసంఘమువారు జ్ఞాపకంరాకమానరు వారిప్రచారఫలితంగా ఏటేట అబ్కారీ ఆదాయం నుష్పష్టంగా పడిపోయినట్లును క్రమంగా కల్లుసారాయిఖర్చు చాలాపడిపోయినట్లును కానరావలసియుండెను ఆ స్థిత నివేదికలలోకానరాదు. ఈ ౧౩౫౦ ఫసలీ నివేదికలోనుఅంతే. పైగా ఈనివేదికలలో మితపానసంఘమువారు చేసినకృషియేమో వారి ప్రచారానికి ప్రభుత్వంవారేమి యిచ్చుచున్నారో అదంతయు తెలుపుచూ ఒకప్రకరణము చేర్చుట అవసరమైయుండెను మితపానసంఘమువారి నివేదికప్రత్యేకము వెలువడుటలేదు. అట్లు వెలువడుట అనవసరము కూడా! ఏ ౧౫వేల వ్యయానికో ఒకనివేదికకూడానా? అందుచేత ఆబ్కారీనివేదికలలోనే ఒకప్రకరణము వీరికృషినిగురించిప్రకటించితే బాగుంటుందని సూచించుచున్నాము.

నివేదికాకాలములో సారాయి దుకాణాలను ౩౨౭౬ నుండి ౩౦౬౬ వరకుతగ్గించినామన్నారు. కానిదుకాణాలు తగ్గితే త్రాగుడుతగ్గవద్దా? దుకాణాలుతగ్గించితేత్రాగుడు తక్కువగుననుటగాని, లేక మత్తుపదార్థాలక్రయం ఎక్కువచేస్తే చాలామందిత్రాగుడుమాన్కుంటారనుట కాని సరియగుతర్కంకానేరదు నివేదికాకాలములో ౨౭౧౮౭౨ గ్యాలనులనుండి ౩౧౨౫౩౭ గ్యాలనులవరకు సారాత్రాగడంఎక్కిపోయింది. అనగానూటికి ౧౪ పాళ్ళుఎక్కువైంది దీనికి కారణాలలో ఒకటి దసరాపండుగఅట! ఏటేట దసరా పండుగవచ్చును. ౧౩౫౦నాటి దసరాపండుగకొత్తవిధమైన పండుగగాదేశమందు ఆచరించినట్లుకానరాదు ఈ కారణము సరిగాకానరాదు. ఆదాయంకూడ సహజంగాఎక్కిపోయింది.

ఈతకల్లు తాటికల్లుదుకాణములు ౧౩౪౯లో ౬౧౪౫౪ ఉండెను ౧౩౫౦లో ౬౩౫౧౩ అయినవి- అనగాతగ్గినవి ఆదాయంలో అంతగాలోటురాలేదు వెయ్యి రూపాయాలకు ౧౭ రూపాయాలప్రకారముతగ్గువచ్చింది. గంజాయి దుకాణాలు ౬౭౦ నుండి ౬౭౩ వరకు హెచ్చెను. దానివ్యయంకూడా ౯౪౩౬ సేర్లనుండి ౧౦౨౩౪ సేర్లవరకు పెరిగెను భంగికాస్త తగ్గినది మొత్తము అబ్కారీ ఆదాయము ౧౯౩౨౫౬౭౨ రూపాయిలు ౧౩౪౯ ఫ.కంటే ౪౪౨౯ రూ తక్కువ అంతే!

మనరాష్ట్రములో బ్రిటిషిండియాలోలేని ఆచారంఒకటికలదు బ్రిటిషిండియాలో రైతులభూములలోపెరిగే ఈతచెట్లు తాటిచెట్లు మరి యితరవృక్షాలున్నా యావత్తు రైతులవే. వాటిపై ప్రభుత్వానికధికారంలేదు వారువాటిని ఇష్టంఉంటేపెంచుకోవచ్చును ఇష్టంలేకుంటే కొట్టవేసుకొనవచ్చును పెంచినపక్షంలో వారువాటిని అమ్ముకోవలసినబాధ్యులుకారు వారు వాటిఆకులను ఇష్టమువచ్చినట్లుగాకోసికొని వాడుకొనవచ్చును ఒకవేళవారు కల్లుగీయుటకై అమ్ముకొనదలచినచో ప్రభుత్వమువారివద్ద లైసెన్సుపొందినవారికే అమ్ముకొనవలెను. ఆపక్షంలో కొట్లపన్ను చెట్టుకు ఒకరూపాయి ప్రకారము ఇచ్చుకొని అమ్ముకొనవచ్చును ఇక మనరాష్ట్రములో రైతులభూములలోపెరిగే తాటిచెట్లపై ఈతచెట్లపై రైతులకు అధికారంలేదు అవిఅబ్కారీవారివిగా భావించబడును. తెలంగానా చెలకభూములలో తాటిచెట్లు పెరిగినట్లుఈతచెట్లును పెరుగవు రైతు రెండుమూడేండ్లు పొలాన్ని బీడుపెట్టినచో తాటిమొలకలుకొల్లలుగా మొలకెత్తి పెరిగిపోవును- వాటినికొట్టివేస్తే అప్పుడే అబ్కారీవారున్నూ పోలీసువారున్నూ ప్రత్యక్షమగుదురు కొట్టివేసిన ఒక్కొక్కచెట్టునకు ౨౫ రూపాయాలప్రకారము జుర్మానాను రైతుచెల్లించుకొనవలసివచ్చును మన తెలంగానా భూములు మొదలేఅష్టదరిద్రభూములు. అవిఇరుకపొలాలు గుండ్లమయము, కంపలులులుము, గడ్డిపూటకొకరంగుతో పెరుగుచుండును ఒకదిక్కుపాసివేసి ఇంకొదిక్కునకుపొయ్యేవరకు మరల అవిపెరుగనేపెరిగియుండును ఈభూములు చదరముగానుండవు. ఏటవాలుగా వాగులతో కూడి, ఎచ్చుతగ్గులతోనుండును- వాటివెల ఎకరానికి ౫ రూపాయలనుండి ౧౦ రూపాయలవరకుండును- ఇట్టిభూములలో రైతులు ఎరువువేస్తేనష్టమగునని వేయరు పంటలుపండవు- ఈభూములను మహిబూబునగరము జిల్లాలో తువ్వభూములందురు "తువ్వభూమిపంట ఒకనాటివంట" అని ఆజిల్లాలోసామెతకలదు- ఇందులోసత్యముకూడా పైకారణాలనుబట్టి పైననేకానవచ్చుచున్నది- ఇట్టిదరిద్రభూములలో అదేమికర్మమో ఈతచెట్లుతాటిచెట్లు ఎవరున్నూ వేయకున్నను, పెంచకున్నను దట్టముగా పెరుగుచుండును పైగావీటిని రైతులుకొట్టకూడదనిశాసించిరి అందుచేత ఈతచెట్లమూలాన రైతులకు మరింతనష్టంకలుగుతుంది- హైదరాబాదు ప్రభుత్వమువారు బ్రిటిషిండియాలోని పద్ధతివలె ఈచెట్లపై రైతులకు సర్వాధికారాలియ్యవలెను ప్రభుత్వమువారికి దానివలన నష్టమున్నదా? ఆ నష్టాన్ని వారు వేరువిధంగా సరిచేసుకోవలెనని పూర్వమొకమారు మేము సూచించియుంటిమి- అదేమనగా పొరంబోకులు బంజరుభూములు, రోడ్లప్రక్కన రోడ్లబార్డరుకుగాను వదలినభూములు, రైల్వేలైనుపొడవునను రెండుదిక్కులలోను విశాలముగా లైనుహద్దులలోనికి తీసుకొని బీడుగాపెట్టబడిన భూములు ఇవన్నీ యెందుకట! వీటిలో ప్రభుత్వమువారు మనసుకువచ్చినట్లుగా లక్షలకొలది కాకుంటే కోట్లకొలది ఈత,తాడిచెట్లను పెంచవచ్చును-

అన్నలు ఈ అబ్కారీశాఖయే యెత్తివేయదగినదని మేముపలుమారువ్రాసినాము- ఎత్తివేస్తే వచ్చేనష్టాన్ని యెట్లునవరించుకోవలెనను విషయములో మేముపలుమారుఅభిప్రాయమిచ్చినాము మరలదానినిచ్చట చర్చించుట అనవసరము

మనరాష్ట్రములో మంచిత్రాగుబోతులెవరయ్యాఅంటె తెలంగానాలోని తెనుగువారుఅని నిస్సందేహముగాచెప్పుచున్నాము మేము చెప్పేదేమిటి?ప్రభుత్వమువారే ఇంచుమించు ౯ ఏండ్లక్రిందట కేశవఅయ్యంగారుగారిని హైదరాబాదురాష్ట్రపు ఆర్థికపరిస్థితినివిచారించుటకు నియోగించిరి వారువిచారించి తెలంగానాలో విపరీతమైన మద్యపాన దురభ్యాసమున్నదని తేల్చిచెప్పిరి. తెలంగానా రైతులు, తెలంగానాశ్రమజీవులు కార్మికవర్గంవారుబాగుపడవలెనంటే ఈఅబ్కారీశాఖను మొదలు ఎత్తివేయవలెను

మనరాష్ట్రము త్రాగుడుదురభ్యాసములో మొత్తము హిందూస్థానములో మొట్టమొదటిస్థానము వహించిన గౌరవము పొందినదని ఈ ౧౩౫౦ ఫసలీ నివేదికయే తెలుపుచున్నది ఎట్లనగా ఆబ్కారీఆదాయాన్ని మొత్తము జనసంఖ్యపైవిభజించగా వివిధరాష్ట్రాలలో ఈ క్రిందివిధముగా ఒక్కొక్కమనిషి మద్యపానముపై ఖర్చుచేయుచున్నాడని తేలినది.

| ప్రాంతము | సగటున మనిషికి మద్యపానంవ్యయం రూ అ పై లు |
| --- | --- |
| హైదరాబాదు సంస్థానం | ౧-౨-౫ |
| బొంబాయిరాష్ట్రం | ౧-౨-౮ |
| మద్రాసు ,, | ౦-౧౪-౨ |
| సీ పి-బిరారు ,, | ౦-౧౪-౨ |

ఇతరరాష్ట్రాల ముచ్చట తెలుపలేదు- కాని బ్రిటిషిండియాలో బొంబాయి మద్రాసు రాష్ట్రాలే గొప్పరాష్ట్రాలు- అచ్చటఆబ్కారీ, ఆదాయమే ఎక్కువ అనిప్రతీతి కావున మనరాష్ట్రములో త్రాగుడుదురభ్యాసం మితిమీరిందని స్పష్టము- దీనికిమితపాన సంఘమువారేమంటారు? ప్రజానాయకులు ఏమిచేయుచున్నారు? "ఫాసిస్టు దురాక్రమణ"కన్న ఆబ్కారీ దురాక్రమణ "విప్లవం" కలిగించుచున్నదంటారా? అనరా?

## శ్రీ గ్లౌసెస్టర్ ప్రభువుగారి సందేశము

ఎచ్-ఆర్ ఎచ్-గ్లౌసెస్టరుడ్యూకు ౧ రుహైద్రాబాదుకువిచ్చేసి యిచ్చటనుండిమద్రాసుచేరిరి మద్రాసునుండివారు మ ఘ-వ-నిజాంప్రభుగారికిందివిధముగా సందేశమంపినారు-

"హైద్రాబాదుదేశీసంస్థానాలలో మొదటిది-ఇదేనామొదటి దేశీసంస్థానపరిచయం, చాలాక్లిష్టమైనయుద్ధకాలంలో సేవచెయ్యుట నాఅదృష్టమనుకొంటాను-ఓడమూలంగా ప్రయాణంచేయునప్పుడుకాదు ఆదరుపాములోకలిగిన్న ప్పుడు నిజమైనస్నేహముయొక్క-పరీక్షజరుగును హైద్రాబాదులోయుద్ధజయమందు విశ్వాసముస్నేహితులకుగొప్పసహాయంచేయుట నేను కనుగొన్నాను- ఇదిదేశీరాజాలగొప్పలక్షణం-యుద్ధానికిమాముసర్వవిధాలా తోడ్పడుటకొరనివరు వాగ్దానంచేసినారు- మ-ఘ-వ- నిజాం గారున్నూ హైద్రాబాదుసంస్థానప్రజలున్నూ యుద్ధానికిచేసినసహాయము చాలాగొప్పది- హైద్రాబాదుపైన్యముయుద్ధరంగములో పోరాడుచున్నది దానిధైర్యసాహసాలు నేను ఎరుగుదును ఈసంస్థానంవారు నావకులకునూ దాఖల్పింది నౌకాబలానికికృతజ్ఞులువారు- హైద్రాబాదుపేరుతో రెండు విమానదళాలు యుద్ధములో పాల్గొనుచున్నవి-

మ-ఘ-వ-నిజాంగారు విశ్వాసపాత్రమిత్రుడు అను సగర్వితమైనబిరుదమును పూర్ణంగా సార్థకముచేసుకొని యున్నారు.

## ఆంధ్ర బాలసంఘ సమావేశము

(స్వవి) మహబూబునగరం,౨౧ ౬-౪౨ నేటిసాయంత్రి ౫౦-౫౦కు ఆంధ్రబాలికా సంఘసభ్యులు, తదితరులు కార్యదర్శిగారిఆహ్వానముపై సమావేశమైరి, విద్యార్థులెల్లరు వేసవి సెలవులకువెళ్లినందున ప్రతివారపు వాగ్వాదసభలుఆగియుండెను వార్షికోత్సవానంతరము ఇదియేమొదటిసమావేశము- ఈసభకు శ్రీమాదిరాజురామచంద్రరావు గారు అధ్యక్షులైరి-

శ్రీ మ-తి వెంకన్న గారు సంఘముపూర్వరీత్యా భాషాసేవయేకాక దేశసేవకూడా చేయవలయుననియు మతద్వేషము లేక మెలంగవలయుననియుబోధించిరి-

శ్రీయుతపి- చెన్నకేశవులుగారు బాలురకు విద్యార్థిదశలోయుండేనరకు విజ్ఞానసంపత్తిని పొటుపడుచు మలమలమాడుచుండిన బీదప్రజలకు ఈదగపోవ కార్యమగు సదుపాయములుగల్పించి, నిరక్షరకుక్షులకు విద్యనేర్పి తమభావములను పల్లెటూరిభాషలోనైన సరిగాబోధించగలశక్తిని సంపాదించుటకై సిద్ధపడవలయుననిరి-

శ్రీయుత, సాంబమూర్తిగారు విద్యార్థులు నడుచుకొనువిధులనుబోధించుచు ఐకమత్యముతో మెలంగి పూర్వమునుండియు నడుచుచున్నట్లు వారికన్న మిన్నగా ప్రపంచకాలపరిస్థితులననుసరించి ఈసంవత్సరపుకార్యకర్తలునడుచుకొనవలయుననిరి-

శ్రీయుతపి- రామచంద్రారెడ్డిగారు సభ్యులను వేళతప్పకుండా రావలయుననిబోధిస్తు ప్రస్తుతకార్యదర్శిహయాము మిగులజయప్రదముగా సంఘమునడుపవలయునని ఆశించిరి-

శ్రీయుతయన్-రామచంద్రారెడ్డి ప్రస్తుత కార్యదర్శి ఆంధ్రసంస్కృతి ప్రాముఖ్యము తెలుపుచు ఈసంవత్సరముకూడ నిరాటంకంగా నడుపుటకును సాధుకార్యనిర్వాహకవర్గమును ఏర్పాటుచేయుటకై అధ్యక్షులవారినికోరుకొనిరి- కార్యనిర్వాహకవర్గపు ఎన్నికలు జరుపబడెను-

### వైశ్య సభ

(ఓ-వి)

కరీంనగరముజిల్లాలోచేరిన మెటుపల్లిజాగీరులో నిజజ్యేష్ఠశు౹౩ వైశ్యసభజరిగెను-కృష్ణమూర్తి గుప్తగారిచేత "పునర్వివాహము"పై ఉపన్యాసమొసగబడెను చాలజనులు సభకువిచ్చేసిరి శ్రీవారిఉపన్యాసమునువినిసంతసించిరి-వేదశాస్త్రప్రమాణములు చూపి,మను, పునర్వివాహమును జేయని యెడల కలుగునష్టములను విశదీకరించిరి- చ్చిన్నటనాన కలిగెడి సౌఖ్యమును, లాభమును విశదపరచిరి-శ్రీ కే-శివరాజ్ గుప్త గారుకూడ ఉపన్యసించిరి-ఆర్యవైశ్య యువజనసంఘమువారు ప్రకటింపబడు కరపత్రములు పంచిపెట్టబడెను- సభవారిచేయూతకుముందు వితంతువివాహప్రమాణక్రమముపై వైశ్యులందరి సంతకములుతీసికొబడెను-

## విజ్ఞానవర్ధని.

### తెనుగువారివలసలు

బర్మాచరిత్రవ్రాసిన సర్-ఏ-పి-ఫేయర్(Phayre) గారిట్లువ్రాసినారు-"[లోయర్] దక్షిణబర్మాఅనగా పెగూఅనురాష్ట్రముప తెనుగురాజ్యమునుండివచ్చిన వలసజనులుజయించిరి"

డాక్టర్ కస్టు (Cust) Linguistic and Oriental essays లో ఇట్లువ్రాసినారు "అనేకశతాబ్దములక్రిందట తెనుగుదేశతీరమునుండి వలసవెళ్ళినబ్రాహ్మణులుకొందరుతమ ఆర్యులు తమమతమును తమపవిత్రగ్రంథాలను తమనాగరికతనుజావా(Java)ద్వీపానికి తీసుకొనివెళ్లిరి అప్పటినుండియేజావాద్వీపము ఒకగొప్పబలీయమైన హిందూరాజవంశమునకు ముఖ్యస్థానమయ్యెను" హంటరుయిగ్ జెటియర్ లో ఇట్లువ్రాసినారు-"సుమత్రాద్వీపములో హిందువులువలసపోయి నిలిచిపోయిరి ఈహిందువులందరును సంపూర్ణముగాహిందూస్థానపుతూర్పుతీరమునుండి పోయినవారు కంచి, ఓఢ్రదేశములనుండియు మచిలీబందరురేవులనుండియు హిందువులువలసవెళ్లి సుమత్రాలోనిలిచిపోయిరి-కాంబోడియాలో ఈప్రాంతాలహిందువులే వలసపోయిరనుటలో ఏమాత్రమున్నూ సందేహములేదు

### పడమటివలసలు

ఆర్యహిందువులు పశ్చిమదేశాలలోనికి వలసపోయిఅక్కడ రాజ్యాలుస్థాపించి తమనాగరికతనువ్యాపింపజేసిరి-మీడులు (Medes)అనుజాతి పర్షియాదేశములోనిది-అజామీఢుని సంతతివారే యీమీడుజాతివారని పరిశోధకుల అభిప్రాయము- మీడుజాతివారికి అజచిహ్నముండెను-అజమనగామేక ఈఅజశబ్దము పైసిద్ధాంతమునుమరింత బలపరచుచున్నది-

మాక్సుముల్లర్ తనవేదానుసంస్కృతీకరించి "మోక్షమూలః" అని ఆతడేశ్లోకబద్ధముగా వ్రాసుకొనెను-ఆతడుమహా ప్రామాణిక సంస్కృతపరిశోధకపండితుడు అంతటిమహాపండితుడే ఇట్లు తనభాషాశాస్త్రము [Science of Language]లో వ్రాసెను "తుర్వసునికిని అతని సంతతికిని రాజ్యవిభాగమందుఏమియు లభ్యమందున వారుదేశాంతరమువెళ్లిపోయిరని పురాణాలలోవ్రాసినారు-అతుర్వసుసంతతివారే తురానలు [తురేనియనులు Turanians]

### ఆలుగడ్డలు

మనఆయుర్వేదవైద్యులు ఆలుకముఅని తమవైద్యగ్రంథాలలోవ్రాసినదానే ఆలుగడ్డయనియందురు-అదికాదని చరిత్రకారులనుచున్నారు ఆలుగడ్డనుకొందరు ఉరగాళదుంపఅనియు నందురు-అంటేఇది మొదలు వంగదేశములో ప్రవేశపెట్టబడినట్లున్నది-అందుచేతమన తెనుగువారు మాత్రముదీనిని బంగాళదుంపఅనియందురు- హిందూస్థానమందు ఇతరులెవ్వరును దానిని పేరుతో పిలువరు-కొందరుదీనిని ఉర్లగడ్డయందురు దీనినింగ్లీషులో పొటాటోఅందురు-ఇదిమనదేశపురాతమకాదు ఇదిమొట్టమొదట అమెరికాదేశములోనిది క్రీ-శ ౧౬౦౦లో దీనిని యూరోపులో ప్రవేశపెట్టిరి యూరోపులోని అన్నిదేశాలపైకి ఐర్లండులో ఇదిచాలా ప్రాముఖ్యతకు వచ్చెను ఈనాడు ఐర్ జాతివారికి ఇదిముఖ్యప్రాణాధారమైన ఆహారము-దీనినిహిందూస్థానములోనికి క్రీ-శ- ౧౬౧౫లో పాశ్చాత్యవ్యాపారస్థులుతీసుకొనివచ్చి ప్రవేశపెట్టిరి-క్రమక్రమముగా ఇదిదేశమంతటను వ్యాపించిపోయినది- ఇప్పుడిదిమనదేశమందలి కూరగాయలలో చాలా ముఖ్యమైనకూరగాయగా పరిగణింపబడుచున్నది-

